# మధుకీల

మల్లవరపు విశ్వేశ్వరరావు





నవ్యసాహిత్యపరిషత్తు ప్రచురణము

# వి ష య సూ చి క

# ఆ వా హ న

కల్లోలపాథోధి కడుపు పూచిన పంట!
కరడు పొంగిన బ్రదుకుకడలిలో పెనుమంట!
అమృతభాండ మ్మంతరాన గుమిలెడి మంట!
అమరలోకము భూమి నదుకు తీయనిమంట!

ఓ సుందరోజ్జ్వలా!
ఓ సుప్తమధుకీల!
మేలుకో మేలుకో
ఈ నవోదయవేళ!
ఏలుకో ఏలుకో
నాగుప్త హృద్జ్వాల!
హే దీప్తమధుకీల!

ఈ వసంతవిభాత
మీా వసుంధర హృదయ
మీా జగత్కల్యాణ
మీా జీవకణభాగ్య
మేలుకో ఏలుకో,
మేలుకో మధుకీల!

మద్ధృదంతర సురభి
మందార మధుమాల !

*          *

దూరమై దూరమై
దృష్టి సోకని నాడు,
నీలమై నీలమై
నింగి దాగిన నాడు,
ప్రారంభ జీవిత
ప్రాతఃక్షణము నాడు —
ఆనాడు నా మర్త్య
మందు ద్రచ్చిన మంట
ఆనాడు, నా జీవ
మందు విచ్చిన పంట,
ఈ నాడు మధుమాల !
ఈ నాడు మధుకీల !

*          *

బాల్య జీవన లీల !
ప్రౌఢ భావ జ్వాల !
వ్యథలలో సుధలో, సం
పదలలో దైన్యమ్మో,

విధుర జీవితములో
నిదురించు నాశలో
కదలించి, గాలించి,
కరుణామయు మొనర్చి,
కరగించి, కవనసా
గర గర్భము విదిల్చి
పరిమళించిన మాల !
పరిణమించిన కీల !
మేలుకో అమృతార్ద్ర
హాలాహల జ్వాల!
ఏలుకో మధుకీల!
నా గుప్తహృద్వేల.

* *

అజ్ఞాత జీవనీ!
అవ్యక్త భావనీ!
అంతరంగాలయా
భ్యంతరజ్వాలినీ!
మ్రోయనీ, మ్రోయనీ
నీ రహస్తంత్రికల
మధుకీలికాంగుళుల
విధురవీణాగళము —

హృదయతృష్ణోజ్జ్వలము,
మృదులరాగాలసము,
మధురమ్మ, మార్దవము,
పృథుల విశ్వోత్సవము!

హే సుధార్ణవబాల!
హే సుప్తమధుకీల!
మేలుకో మేలుకో
ఈ నవోదయవేళ!
ఏలుకో ఏలుకో
నా గుప్తహృద్వేల!
హే దీప్తమధుకీల!
లీలాప్రణయహేల!

# సందేశము

ఏ పూవుటెదలోని ఏ సౌరభమ్మొ
తెలియని ఏ ముగ్ధ మలయానిలమ్మొ
అందని ఏ దూర మందనిక్వాణమొ
నా ఉషోగగనాంగణాన దోతెంచు!

ఎ సిగ్గువిరిబోణి ఏ రహస్యమ్మొ
పసివాడు ఏ లేతవలపు నిట్టూర్పొ
బేలయౌ ఏ గుండె బెదరుకోరికయొ
నా ఉషోగగనాంగణాన దేలెడిని!

తలపుల కందని తార సైగలకు
ఎరుగనే యెరుగని విరి వాసనలకు
కనిపించి మాయమౌ కాంతి వార్తలకు
రేగు నా హృదయమ్ము రెపరెపలాడు!

వెదకి వేసరి పూవుటెద గ్రోలు తేటి,
ఎగసి వెన్నెల జేరు సాగయు చకోరి;
తెలియని కోరికే తెలుపును దారి,
అన్వేషణమ్మె నా యాత్రాపథమ్ము!

# శు భ లే ఖ న

నీ కనుల చల్వచూపులు ప్రాకనీయు
మీ ప్రియాస్పదు పాల శోభాప్రదముగ,
నీ యెడద నిల్వనీయుము నిశ్చలముగ
ననితరామోదనిలయ మీ యాత్మసుమము.

కలువరేకుల నీ కన్ను గవ గగంగ,
ఈ తరుణు చేత మిందుకళాతరళము;
చలువనెలనగు నీ యురశ్శయ్య నొరగ,
ఈ యువకుమారు తాపమ్ము లిగురు సుమ్మ.

దివ్య జన్మాంతర స్వర్ణకావ్యములనె
మన మధుర మేళనాభివర్ణన వెలింగె;
ఈ నవోదిత కాలతీరాన మనకు
నమరెనా శుభలేఖనానంత సుఖము !

ఆలసింపకు ప్రియతమా! అలరనీయు
మీ శిరీషపేశల యౌవనాశయమ్ము
లీ నవప్రేమసుందరామ్లాన సూన
మాలికాంజలి నీ శిరోమాన్యసీమ!

తలపు లిక నేల సంశయతాపితములు ?
తడబడ నికేల జంచలాతంక చింత ?
శ్రీచరణ పూజనాయత్త శీలు నితని
నీ శుభముహూర్తమున నేలుకో శుభాంగి !

# నిశాలోచన

తెల్లగా నెలవంక తేలిపోతోంది—
చల్లగా నా ఊహ
మెల్లగా భావాల
నల్లిబిల్లిగ పాట
లల్లుతో వుంది!

ఆ మినుకు తారలే అడుగుతున్నాయి—
"ఏమి చింతలో నీవి,
ఏ యుదంతము నీది,
ఆ చిన్ని పాటలం
దడుకు తున్నావో?
నీలాల నింగిలో
నీ గీతికలు తేలి
ఏ యుషస్సుల పొంత
కెగయు చున్నావో?"

* *

కలతనిద్దుర లేచి కలవరించాయి—
అస్పష్ట భావాలు
అణచుకొన్నా గాని

పండువెన్నెల జూచి
పాడుతున్నాయి !

ఎక్కడో నాపాట ఎవరు విన్నారో—
ఏ లేత గుసగుసలో
ఏ రహస్య స్మృతులో
"నీ పాటలో నన్ను
నిలుపు" మంటాయి;
"ఆనాటి నీ యూర్పు
లే నన్ను దోచాయి,
నీ వంతలో కొంత
నిలుపుకున్నా" నన్న
పలుకు లేవో నన్ను
పలుకరిస్తాయి !

*          *

నిదురలో వెన్నెలలు నిశ్వసించాయి—
అందకే దూరమై
ఆగి రమ్మని పిల్చి,
తలపు లేవో పాట
దారి కడతాయి !

జాబిల్లి నడినింగి జేరి ఒరిగింది—
ఏ లేత వేకువను
ఏ యాస లేచుననో
నాగుండె రెపరెపలు
రేగుతున్నాయో ?

చంద్రవంకే చీర
చెరగు విసిరిందేమొ,
నక్షత్ర దీపికలె
నటియించెనో యేమొ,
నా పాటలో వెల్గు
నాట్య మాడింది !

ఏ కళ్ళలో పలుకో
ఏ బాలికల తళుకో
నా యూర్పులకు లేత
నవ్వు తెచ్చింది !

*    *

ఆకాశమే నన్ను ఆలకించింది—
నా చింతలో ఆన
నటియించడము జూచి

నాకోస మొక జాలి
నవ్వు పూచింది:
ఆకాశమే నన్ను ఆలకించింది —
"మరచిపోయిన స్మృతుల
మధ్యలో ఆ పువ్వు
వికసించి, వాసించి,
వెల్గి నవ్వుడు నీకు
చింతలో, వంతలో,
చిగురుటాసలు కొన్ని
నిట్టూర్పు గాలిలో
నిలుచు సౌరభ మట్లు
పులకరిస్తా" యనీ
పలుకరించింది!—
తెల్లగా నెలవంక తేలిపోయింది!

# ఉషస్సు

కూడె కొండల నెన్నొ రంగుల నెమళ్లు!

జిలుగు పురి విచ్చి పేర్చియసి జీరు నొండు:
"ఉష ప్రశాంతము, నింగిపై మసలు నీల
మేఘములు, చూడు మదె వృక్షశాఖ నూగ
జంటపూవులు మనల గ్రేగంట జూచి
నవ్వుకొనెడి, నా ప్రేమైక నవ్యరాజ్ఞి!
జలజలని పారు నీ కొండసెలల యలలు
తాళము దనర్ప గాలులు లీల బాడ
నన్ను గూడి నిత్యానంద నాట్యకేళి
దేలియాడుము! మన ప్రేమఖేలనమున
భూనభోంతరాళంబులు లీనమగును!"

రంగుల మయూర మట్టు లుప్పొంగి పిలువ
నా యెదయు నెమ్మియై నిల్చి నాట్యమాడు!

# ప్రేమ గానము

...... నీ

సోగ కన్నుల కొనల
సుమియించె నో సఖి!
వేయి తారల మిన్కు-
లూ తళుక్కు-లూ నాకు!—
ఏ నభస్సీమవో?
ఏ శుభ స్వర్గాల
య జ్యోతులో? దివ్య
సుమ కోరకాలో?

నీ కళ్ళ లోతులం
దో కోమలీ! తూగు
తూ, ఊగుతూ, పాడు
తూ నాట్య మాడేవి,
ఆ లేత వెల్గుచా
యలె నన్ బలుకరించు!
ఓ చెలీ! నీ వాక్సు
ధా చంద్రికల దేలి

నే తాన మాడేవి,
నే పూత మయ్యేవి,
ఆ దినాల శుభోద
యా లెప్పుడో?
ఆ శుభోత్సవ సుక్ష
ణా లెన్నడో?

నీ గులాబీ నవ్వు
లో గుబుల్కొను తావి,
ఆ లేత భావాలు,
ఆ వింత సైగలూ,
నా గుండెలను లాగ
నా యౌవనము రేగ,
నీ చేలపు చెరంగు
వీచు గాలులు సోక,
ఉపశమిల్లునో మనసు
తపన పాలే యౌనో
తెలియనే తెలియకే
అలసి నిట్టూర్తునే,

ఓ దివ్య సమ్మోహినీ కామినీ!
ఓ చకిత సౌరభిత సౌదామినీ!

నా జీవ నవయౌవ
నావిహ్వాల పథాల
నే నొంటినై గాలి
లా సాగి పోయేది
ఎంతకాలము చెలీ! —
చెంత నీవే కాని
వింతగా విరియుచో,
అంతంత నిన్నో ల
తాంతమ్ముగా మాళి
దాల్చనా నెచ్చెలీ?

ఈ మర్త్యలోక ధూ
ళీకణ మ్మొండేని
నే సోకనిత్తునే
నెచ్చెలీ! నెచ్చెలీ!
నీ దరోత్ఫుల్లాబ్జ
పాదాంచలము నేని?

నే నీ జగమ్మెల్ల
నేలు రారాజైన
నా సువర్ణోచ్చ సిం
హాసనమ్మే నీది,
నా యబ్ధివేల్లిత
నానా భువనరాజి
నేలు రారాణి వీ
వే, నాదు నెచ్చెలీ!

నా భాగ్యమే పండి,
నా భావి వెల్గురె,
నా గానమే దిగం
తా లంటి మ్రోసెనా,
నా మనోరథ మీవ!
నా మహోదయ మీవ!
నా గానమున మ్రోయు
నాదలక్ష్మివి నీవ!

నాకు నీవే లేని
నాకలోక మెడారి,

నా జీవన నదమ్ము
నడిదారినె హారించు;
ఆరబోని పిపాస
నలసి నే తపియించి,
అరవిచ్చి పసివాడు
సుమ మౌదునో?

విరిగి వ్రాలిన లేత
ద్రుమ మౌదునో?

# గాయనీ ప్రియ

౧

ఆమె హసియించు కెమ్మోవి నరసినంత
నిలువు నిలువెల్ల గలకల పులకరించె,
ఆమె గళమెత్తి పాడిన నా మనమ్ము
రెక్కల విదిల్చి జల్లని చొక్కిపోదా !

ఆమె లావణ్య మెర్రగులాబి మొగ్గ
వోలె, చిరుత దీపజ్వాల వోలె, మంద
మలయవాత సంస్పర్శన మధురిమమ్ము
వోలె నా భావమం దాగిపోయె నాడు!

వనలతల నెల్ల వెదకితి ననవరతము
నామె సౌందర్యలత గాంచు నాశతోడ,
అడిగితిని గాలిబాలిక నామె జాడ,
ఆగి వెదకితి సెలయేట నామె నీడ !

ఆమె తలపె నా గుండెల నాపివైచి
పరవశమొనర్చు నట్టె విభ్రాంతి ముంచి,
ఆమె పిలుపె నా శ్రుతివీధి నంటె నేని
కరగి నీరయిపోదొ నా చిరుతపాట !

౨

కనుల మిరుమిట్ల నీని, యౌవనసుమాంగి!,
చూరగొనె నా యెడంద నీ యోరచూపు,
నా హృదయవీణపై నిస్వనమ్ము రేపి
మాయమైతివ నన్ను తన్మయ మొనర్చి?

తెర వెనుక జోతి వెల్తురు కరణి, జూపు
మేర కావల మిన్కును తార పోల్కి,
కరము సాచిన దూరమౌ మెరుగుబురుగు
భాతి భ్రమియించి మాయమైపోతి వబల!

అపుఁడిపుడు దృష్టిపథమునం దవతరింతు
విరుపు మెరుపుల తీవవై, పరువులెత్తి
కిలకిలని నవ్వి ప్రవహించు సెలవు, నలల
దేలియాడెడు రాయంచ బాల వౌచు!

అగపడని పూవు సౌరభ మట్లు, వినని
రాగము గళమ్ములో బడి సాగునట్లు,
లేగులాబి ముసుంగున దాగి నాడు
నన్ను గికురించు నీ చూపు లున్న విపుడు!

## ౩

నా ప్రథమదృష్టి నీ సువర్ణాంగ జలజ
మరవిరిసి తేలె నీ గానమందు బాల!
ఆ మధురమూర్తి సంస్మృతులందె కోర్కి-
పూచి, వాసించి, నేడును వేచియుంటి!

నీ మధురగాన మానాడు నెమ్మి వోలె
పురి నెగయబోసి మిలమిల మెరసిపోవ,
విపుల నేత్రాళి నీ ముగ్ధ-వీక్షణమ్ము
లటునిటుల సిగ్గుతో నడయాడినాయి!

నీ యొడిని ముద్దువీణియ నిలిపి మీట,
నంగుళీ చంచల కిసలయమ్ము లరుణ
రాగముల వీణగళమును జేగురించె,
కోకిలల పాటలే దాన రేకులెత్తె!

చిన్నిచిని సిగ్గుచివురులు పన్ని నేడు
తన యొడిని దాచికొనియె యౌవనము నిన్ను,
ముసిముసి యమాయకత్వమ్ము మూగవోయి
పలుకజాలదొ పెదవుల వెలికి బారి!

౪

నా తరుణమానసము సుధకై తపించి,
నీ వికసితాధరమ్మున నిలిచిపోయి,
మాధురుల సోలు భృంగమై మరలిరాదు,
యౌవనలతాంగి! అది యేటి యద్భుతమ్మొ!

నా వలపు నీ తలంపుల నవసి యలసి
మంద మలయానిలమ్ముల మలసి బాల!
నీ కుటిల కుంతలమ్ముల సోకినంత
దెలియకే తన్మయత్వమ్ము కలిగె నీకు!

తొలి యుషోరేఖ నీదు చెక్కిలిని బ్రాకి
కనుల ముద్దిడి గగురించి చనిన వేళ
నా నవప్రేమ రేకెత్తెనా యటంచు
నిదుర మేల్కొన్న కన్నుల బెదరినావు!

అందని సుమమ్ము నీవు నా కంచు వెరచి
అగపడని ప్రేమవార్తల నంపు టెల్ల;
తరుణవన కోరకమ! నీవు విరియు టెపుడు
తహతహల వేగు నీ తేటి తనివి తీర?

# స్వప్న భంగము

సమ్మోహన స్వప్న
సంతతానంద ప్ర
పంచమ్ములో సృష్టి
నింతకాలము దాక,

వింతవింత సుఖస్ర
వంతీ జలాలలో
దేలియాడుచు నింద్రి
యాలు సల్పెను కేళి!

నీలాంబుదాలలో
దేలి దోబూచాడి,
గాలిమేడల శాంతి
గ్రోలి దేహము వాల్చి,

శంపాలతల పూలు
తుంపి దామము లల్లి
కవితాప్రియా మంజు
కంఠాన కైసేసి,

సత్య సుందర భావ
సంకల్పనా కేళి
నిత్య మానందైక
నిరతి కాలము పుచ్చి,

అత్యద్భుతమ్ముగా
నాటలాడిన జీవి
ఇ మ్మహాస్వప్న భం
గ మ్మెట్లు సహియించు ?
ఈ వాడువారు నై
హిక చింత లెటు, సైచు ?

జ్యోత్స్నా కరాలలో
జోగు నిద్రల నుండ,
ధూళి ధూసర లోక
మేల నన్నిటు సోకి

మేలుకొల్పి, ఎడంద
నీలీల విదళించ?

కాలగర్భము విచ్చి,
కరడువారిన భావి
నేల నా కనుదోయి
నీరీతి జిత్రింప?

ఏల దుఃఖసుఖాల
నీలాగు మెరిపించి—
సుఖశంప మరిగించి,
శోకాంబుదమె పెంచి,
కరిగించి, కరిగించి
కారు జల్లుల ముంచి,

లోక మెల్లను శీత
లీకరించి, ఘనీభ
వించి, కంపిల జేసి,

ఈజీవ నిర్ఘరిణి
హిమవాహినిగ పేర్చు
కాలాంతకుని కింత
కాఠిన్య మది యేలొ ?

కారు చీకటి దివ్వో
కరము నొంటిగ బూని
దారి జేసుక పోయి
పారమ్ము జేరంగ
నీ లేత భావనా
శీలి కెట్లబ్బునో !

అరవిచ్చు నాశ ల
ల్లన వాడి రాలగా,
పురి విచ్చు నాశయ
మ్ము లదృశ్యమై పోవ,

ఆగి వెల్గిను భా
వ్యాలయ జ్యోతులే
ఆరిపోవునో యేమొ
యను భీతి దహియింప,

ఆ దివాస్వప్నాలు
ఆ నవాశ లవెల్ల
నవసి కృశియించునో ?
నిలిచి జీవించునో ?

# అడియాస

ఓ యాణిముత్తెమా! ఓ కన్నెపూవ!
కడలి నీ పుట్టిల్లో? కాన నీ నెలవో?
కనకాలు కురియించి కను మెరపించు
నే మహారాజులనే వరించెదవో?

నేనేమి, నా పేద గాన మ్మదేమి?
వెదురుంబొదల గాలి సొద లెంత నీకు?
చెదరు నిట్టూర్పుల పదము మెచ్చెదవో,
అడియాస లందు నే నలయుటే కాని!

* *

మున్నీటి నురుగుల ముందు సాగిల్లి
ఎన్నెన్ని తలపులో విన్నవించుకొని
అల ముత్తియపు కన్నె కందింప గోరి,
మనసు నీరగు రీతి గనలి వేచితిని!

తలిరుటాకుల నిద్ర మెలకువ మున్న
తొలిపొద్దు రేకుతో వలపుల నెన్నో
అలరుంజెలికి దెల్పుమని కేలు మొగ్గి,
అడవి హద్దులలోనె బడలి తాళితిని!

* *

తులలేని కళలీను తెలి మౌక్తికమ్ము
ఎంచునా, నైరాశ్య చంచలమ్మౌచు
దూరదూరాననే తారు నా ప్రేమ?—
నిధు లిచ్చు రాజరాణ్ణికరంబు లుండ !

స్వర్ణమందిర సుఖ ప్రాంగణమ్ములనె
ఆ యమూల్య సుమంపు టంతరంగమ్ము
అలరి జీవించునో, అదియేమొ కాని,
లోక మ్మెరుంగును, ఆకన్నె యెరుగు !

*            *

నాకు హర్మ్యము పేద యాకుటీరమ్మొ,
చీకటిచాయలో జిందు వెన్నెలయె
నా కాంచనధనమ్ము; నన్నెట్లు వలచు
మెరుగులే మోహించు విరిబోణి నేడు ?

ఆణిముత్తెపు కన్నె, అలరు ముద్దియయె,
అతులిత సుకుమారి, అమర సుందరియె,
నా నిత్య గీత దీనానులాపముల
నేమొ యెన్నడో యామెయే వరించునోకో ?

# గడ్డి పువ్వు

తెప్ప వోలిక చంద్రబింబం
తేలిపోతో వుంది నింగిని—
అందులో నా ముద్దు ప్రేయసి
వుంది కాబోలు!

లేత చిరున వ్వెందుకో? సిగ
లోన వెన్నెల మల్లె లెందుకో?
చేతి సైగలు చేసి నన్నటు
చేరరమ్మను టెందుకో?

గడ్డిపువ్వుని! నన్ను, ప్రేయసి!
గాలి తరగల దేలిపోతో
కళ్ళలో అద్దాల మెరుగులు
చల్లి కలచెద వెందుకే?—

నీకు నేనే కావలిస్తే
నింగి వాదులుకు నీవె సీతా
కోక చిలుకవా దేనివో అయి
రాగలవు!

— నే నొద్దు కనకే
ముత్తెములో రత్నాలో యేరుతో
చిత్రిమవు నా మబ్బు కడలినె
అర్ధచందుృడి దోనె లోనే
ఆడుకుంటావు!

గడ్డిపువ్వుని,— రేకు రెప్పల
కలలు కంటో కలవరిస్తో,
కలత నిద్దుర లోనె యెప్పుడో
కళ్లు మూస్తాను!

# భగ్నతరణి

నాడు ప్రత్యూష హర్మ్యాంగ ణాంతరమున,
అరుణ పల్లవ నిబిడమా తరుణ చూత
భూజ తలమున, యౌవన పుణ్యసంధ్య,
మైమరచి సుప్తి లోక మేమరితి నేను.

కలలు రంగులు రంగులై కవిసె నిముస
మా నిదుర కన్నురెప్పల లోనె,— ఏమొ
కారుమొగి లంత ప్రాగ్దిశ గమ్మి, హర్మ్య
చూడమై నిల్చి, దెస లంటె నీడ యురుల!

అరుణ కాంతు లొక్కొక్కటే సురిగిపోయె,
తరుణ చూతమ్ము మంచులో గరగిపోయె,
నా నిదురసీమ యేలోకో లీనమయ్యె
కారుమేఘంపు మసకలో;— కలగి, కవిసి,

రంగురంగుల కలలన్ని రగిలి రాజె
నొక్క కాలాగ్నికీలగా!— ఒకడ కనలు
తత్తమోగర్భమున భగ్నతరణి భాతి
మునిగిపోయితినో యేమొ? ......

# దీపావళి

నిశి కడుపులోన దీపికల్ నిలిపి రెవరు ?

నీలి నింగిని దుఃఖాలు తేలిపోవు
మేఘముల నెక్కి; దీపికల్ మెరసి పాడు
నే విజయ గీతినో; గాన రావమునకు
తాళము దనర్చు మేఘాశ్వతతి ఖురస్వ
నమ్ము! — దుఃఖాల విజయోత్సవమ్ము కొరకు
'తళతళ' ని పాడు దీపావళులను నేడు
నిశి కడుపులోన దేవుడే నిలిపినాడు !

# వార్ధి

యుగయుగము లెన్ని కబళించి యుంటివోయి
వృద్ధ వార్ధీశ్వరా! తృష్ణనివృత్తి లేదొ?

ఆశయమ్ములు నశియించి, ఆశ లెల్ల
హతమయి, కృశించి ప్రేమ, సున్నితపు టెద ల
వెన్ని పతితమ్ములై మున్గియున్నొ నేడు
నీ వదనగహ్వ రాగాధ నీరములను,
వృద్ధ వార్ధీశ్వరా! తృష్ణనివృత్తి కాదొ?

ఈ యఖండ భూమండల మిమిడిపోవ
నీ మహా జలకాయమ్ము నింగి కెగసి,
యా దిగంతమ్ములనె మేఘలాకృతిగ సు
దీర్ఘ బాహురజ్జువుల బందీకృతమ్ము
జేసివై చెను, గర్జనోచ్ఛ్వాస మొలయ!

నీ సునీలాంబు ఘోషయు, నీ విశాల
వక్షమున గనలెడి రోషవహ్ని, నీ త
రంగ మత్తతాండవ నృత్యభంగి జూడ,—
అందని సుఖాభిలాషనో, అణచుకొన్న

దీరని పరాభవమ్మునో, తీరసీమ
గడచి ముంచెత్తు నిష్ఫలాకాంక్షనో స్ఫు
రించి, యెద భీతిభావమ్ము నించు నోయి!
ఈ యసీమ సామ్రాజ్యమ్ము నిట్లు నీ క
రాల నులి జేసివేయ నే లబ్ధి కలుగు?
వృద్ధ వార్ధీశ్వరా! క్షున్నివృత్తి యానె?

విరిగి పడు దురాకాంక్షలు తెరచుకున్న
ముఖకుహార భిత్తు లొరసి మార్మ్రోగిపోవ,
కారణమె లేని పగ దీర్పగోరి యంధ
శక్తి నీ యమాయికలోక రక్త మెల్ల
ధవళదంష్ట్రిక లరుణిమ దాల్ప ద్రావ,
భయద నీల విద్యుత్తుల బయలు గ్రక్కి
ఈ యమావాస్య నిశ నలయించి నవ్వ,
వృద్ధ వార్ధీశ్వరా! క్షున్నివృత్తి యానా?

# ఒక రేయి

నిసి నిశ్శబ్దత మున్గె, వార్నిధి మహా
నిధ్వానముల్ మాత్ర మా
కసపుం ద్రోవల మ్రోత వెట్టెడిని,
రాకాచంద్రు డా మేఘ సం
గ్రసితుండై కనరాడు, చంద్రికలకై
కాంక్షించు నా ముగ్ధ మా
నస మీరాతిరి నిద్రవోదు, తలపుల్
నట్టాడు నా రోదసిన్.

తరు గుల్మమ్ములు విశ్రమించినవి,
నిద్రాయత్తలై పూలు మూ
సి రహస్యమ్ముగ దాచికొన్నవి లతల్,
చిత్రమ్ము! పత్రమ్ము లే
వరసుప్తిం గలగాంచునో గుసగుసల్
వర్తిల్ల, నీ రేయి కా
తరమై నాయెద మాత్ర మంబుధి నినా
దార్థమ్ము లాలించెడిన్.

చలన మ్మాగిన రీతి దోచి జలద
చ్ఛాయల్ గతిం బొందు, నా
వల మాటొందు సుధాంశు డంతనె దిశా
ప్రాంతమ్ములే నింపు వె
న్నెల చల్వల్, కృశియించిపోవు
దనలోనే వృద్ధ పాథోధి ఘో
షలునున్, నా హృదయమ్ము మాత్ర మటులే
స్తబ్ధమ్ము భావోద్ధతిన్ !

భరమై చింతన ఉప్పతిల్లి మది
దిగ్భ్రాంతమ్ముగా జేయు, నీ
చిర శోభావహమా ప్రశాంత ప్రకృతి శ్రీ
మందిరమ్మందు ని
ద్దురయే లేని విరామమేమొ నను
బద్ధుం జేయు, నా జీవన
మ్మరవిప్పారిన రెక్కలార్చ కటులే
యాలించు నిశ్శబ్దమున్ !

రత్రి

# ఒంటరి సుకము

కొండ చరియల మీద
కూర్చుంటి నొంటిమై —
దండ నీ వున్నట్టి
పండు గానా నాకు?

పలవ కొమ్మల మర్రి
పట్టె నాకుల గొడుగు! —
నీడ నీతో కూడి
పాడుకున్నా సొగసు,
ఒంటి మన గుండెలో
జంట నెత్తురు బొట్లు
ఆడుకున్నా సుకము
నేడు లేనే లేదు! —

కనబడని దూరాల
కలిసిపోయెను జలధి
నింగి నీలిమ లోన —
నీ స్మృతుల నా యెదయు
నిలిచిపోయిన దట్టె!

ఆ నీలి దూరాల,
ఆ స్మృతుల తీరాల,
మంద మందమ్ముగా
మనసు నీదరి జేరి—

ఈ మర్రి నీడనే,
ఈ కొండ చరియనే,
మే నొంటిమై మిగిలి
నే నుంటి నో చెలీ!

నీడలోనే మరిగి
వాడి నేలను వ్రాలు
దండ ప్రేయసి లేని
యెండుటాకును సుమ్ము!
నా చెలీ! నా చెలీ!
నే డిదేలనె సుకము ?

# విషాదగీతి

జీవితమ్ము నిరాశా విశీర్ణమై, మ
నమ్ము చింతాకులమ్మయి నవసి, హృదయ
సీమ యానంద మేది శుష్కించు నాడు,—
ఈ సమీర తరంగమ్ము, లీ సముద్ర
నిత్య సంతోష ఘోషముల్ ప్రత్యుషః పు
నీత దరహాస మృదు కిరణేక్షణమ్ము
లమర జీవ మ్మొసంగి, తాపార్తి బాపి,
జీవిత మ్మొక్క స్వప్నమ్ము సేయలేవో ?

ఈ ప్రకృతి చిత్రశోభలే నా ప్రబుద్ధ
బాల్య ముకుళ దళమ్ముల బ్రస్ఫుటించె!—
ఇపుడిపుడె లేత గుసగుస లీని గుండె
లాగికోలేని జీవరహస్య తతుల
నొకటొకటె గాలి వీనుల నొలుకు వేళ
నే, హతాద్భగ్న గీతికలేవో నా మె
డంద నలయించి, చలియించి, సందడించు !

అరవిరియు యౌవనోత్సాహ పరత నెల్ల
అపుడపుడె రెక్కలల్లార్చు నాశ లెల్ల
వ్యర్థము నొనర్చివైచి, జీవాలయంపు
ప్రాంగణాన నార్తశ్రుతి ప్రతినినాద
మేల? నా యౌవనాభ్రమం దిట్లు కాంతి
మాయ నీలాంబుదమ్ములు మసల నేల?

ఉష వికాసించు కోమల ప్రసవపాళి
మధుకర కుమారకుడు చొక్కి మసలుచుండ,
ఈ యెడద ప్రేమలేక కృశింప నేల?
ఈ పెదవియే పిపాస దపింప నేల?

ఆమని మదించి కోయిల హాయి బాడ
నీ వసుంధర తన్మయీభావ మూన,
గద్గదిక వోవనేల నా కంఠరవమె?
ఏల నా జీవితమ్మె శోకాలయమ్ము?

తలిరు ప్రాయంపు టలరుగుండెల విసమ్ము,
సమ్మదాశ్రువులందె శోకమ్ము, గ్రోలు

మధురసమ్మందే కాలాగ్ని మసలనేల ?
ఆశలె నిరాశలై శూన్య మలమనేల ?

ఈ ప్రథమసంధ్య శోణర శ్మిప్రశాంత !
శశ్వదానందమూర్తి ఈ విశ్వప్రకృతి !—
నా హృదయమే విషాద సందేహములకు
దావలమ్మయి నేడు నిర్జీవమయ్యె.

ప్రణయ నైరాశ్యమున గుంచుకొనిన పూవు
టెడద రేకులు వసివాడి సడలి, అయ్యొ !,
రాలిపోయిన తలిరు తురాయి దళము
లయి, వసుంధర !, నీ వక్ష మాశ్రయించు !

ప్రవిమల ధ్యానపూత, ఈ ప్రకృతిమాత
నేత్రముల నీడ నా లేశమాత్ర జీవ
నమ్ము వాత్సల్యదృష్టి భాగ్యమ్ము వడసి,
మోసులు వెలార్చునో, పూచునో సుమాలు ?

# ప్రవాసి

కర్కశ హిమాద్రి శిఖరాల గరగి పారు
నా హిమానీ ప్రవాహినులం దడంగు
శీతలత నా కవితలోన జూతువేని,
పాఠక సఖుండ !, నిర్వైరపాటు గనకు—
కరుణ విరహిత జన తిరస్కారములకు
పాలువడ్డ నా జీవిత పదము లెల్ల
వేరిపోయెను ! మంచుగా మారిపోయె !

మేఘముల జీల్చు తారనై మెరయు టొండె,
అల్పుల కఠోరఘాతల కాగు లోహ
హృదయపిండము కైతలో పొదువు టొండె,
క్రుంగి కుమిలి క్రుళ్లిన సంఘురూపముల
సహింపనోపక మృత్తిక నింపి నవ్య
భావ నిర్ఝరిణీ జలపాన మొండె
కతముగా, సంఘశత్రున్నై కరుణలేక
దరుమబడితి ! ప్రవాసాల దిరిగి మనితి !

ఇనకరాలు రక్తమ్ము నుష్ణించి, ప్రేమ
రేపి, ప్రాణాలలో నాసతీపి లేపు

వేడి భూభాగముల నిల్వనీడ లేక,
నిరత హేమంత శైతల్య నిలయమైన
నిబిడ ధ్రువ తమసమ్ములనే వసించి
జీవముల నుంటి,—— నింకను చావకుంటి
నేను —— నా జీవగీతాల నానవచ్చు
మానవుడ!, నే నరుడ గాను, మంచుగడ్డ
లై నశించి, పేరిన శిలలై కృశించు
నాదు జీవాలు తిమిరాల నా ధ్రువాల!

కాన గర్కశ హృదయాల గరగి పారు
దారుణ హిమప్రవాహాల దాగి యడగు
శీతలత నా కవితలోన జూతువేని,
పాఠక, సఖుండ!, నివ్వేదపాటు గనక,
నిల్చి నా రూపు కైతలో పోల్చుకొనుము!

# పి పా స

ఎరుగరాని పిపాసతో నే నొకండ
నంతులేని, పారమెలేని, యలవి కాని
జీవిత పథాల ద్రొక్కుచు బోవుచుంటి —
లేరు ప్రేమాస్పదులు నాకు, లేరు సఖులు.

కణకణాల నీను కాలాగ్ని కణము బోని
నా హృదిని వేదనాస్పందనమ్మె పంచు
నా రుధిరమం దనల ధార; నా పదాలు
కంటక పథాల బడి చీలికలుగ బగిలె,
నా శిరోజమ్ము లెండల నవసి వాన
జివికి చిందరవందరై చెదరిపోయె,
నా తనూలత క్షుత్తృషా కాతరమయి
సోలిపోయెను;

చురచుర కాలిపోవు
బ్రదుకు టిసుకయెడారిలో బాహులెత్తి
'దాహ!' మని మ్రోగు నా మహత్తర పిపాస!

# నిరీక్షణ

వేయి కరములు సాచికొని, నా
వేయి కన్నులు విరిసికొని, నా
వేయి గుండెలు కొట్టుకొనగా
వేచి యుంటిని, కాచి యుంటిని!

ఏల రావో ప్రేయసీ! నా
కాల మిట్టులె కడపి పుత్తువా? —
ప్రేమ కంటె నికేమి తెత్తును
ప్రేయసీ? నా ప్రేయసీ!

కాల గర్భము కరగిపోగా
నీల గగనము విరిగిపోగా
వేయి కోర్కెల వెఱ్ఱి బరువుల
సోలి పాడితి! సొమ్మసిల్లితి!

ప్రేమ నెంతో చిందివైచితి
ప్రేయసీ! నీ పాద యుగళిని, —
ప్రేమ కంటె నికేమి తెత్తును
ప్రేయసీ? నా ప్రేయసీ!

కంటిరెప్పలు మింటికప్పుల
నంటిపోయె నిరీక్షణంబున !
ఫాలతలమున రక్తనాడులు
భగ్గుభగ్గున మండుచున్నవి !
వేయి ప్రేమల వేడి యూర్పుల
వేగిపోవుచు వేచియుండగ,

ఏల రావో ప్రేయసీ ? నీ
కేమి కావలె నింక ప్రేయసి ? —
ప్రేమకంటె నికేమి తెత్తును
ప్రేయసీ ? నా ప్రేయసీ !

వేయి కన్నులు ఆరిపోయిన
వెనుకనా నీ వాగమించుట ?
వేయి కరములు విరిగిపోయిన
దనుక లే వాలింగనమ్ములు?
వేయి గుండెలు తరుగలేదని
కనుకనా నీ ప్రేమనిరసన ?

ఏల రావో ప్రేయసీ? నా
వేయి ప్రేమల వెల యిదేనా?
వేయి ప్రేమల ఋణము దీర్పగ
నీయలే వా కౌగిలేనా? —

*            *

ఓ సుహాసిని! ఓ సుభాషిణి!
ఓ సునీల విశాల నేత్రీ!
ఓ సుమావృత నీల కుంతలి!
ఓ సుకోమల స్నిగ్ధ గాత్రీ!

*            *

చేయి చేయిని గీలుకొనగా
వేయి చేతులు వలచి యున్నవి,
మోవి మోవిని జూరగొనగా
వేయి మోవులు వెదకు చున్నవి,
కాయమును కాయమ్ము సోకిన
కరగిపోవగ వేయి గుండెలు
మరుగుచున్నవి, ప్రేయసీ! నీ
వరుగుదేరుము, ప్రేయసీ! నా
వేయి వ్యధలును నీ కవుంగిలి
వేయి సుధలై విరిసిపోవును!

ప్రేయసీ! నా ప్రేయసీ! నీ
వేల రావో ప్రేయసీ!— నే
ప్రేమ కంటె నీకేమి తెత్తును
ప్రేయసీ? నా ప్రేయసీ?

ప్రేమ జీవన మిదిగో! దోయిలి
పట్టు ప్రేయసి!, ధారవోసెద
నాదు ప్రాణము, నాదు మృత్యువు,
నాదు నిత్యత, నా యనంతత.

ఏమి కావలె నింక ప్రేయసి!
ఏల రావో ప్రేయసీ?— నా
ప్రేమ నిస్తిని! ప్రాణ మిస్తిని!
ప్రేయసీ! నా ప్రేయసీ!

# విస్మృతి

ఒక తారక
తన కన్నులు
వికసించుకు
నను పోల్చెను! —

'ఒకనా డీవే నక్ష
త్ర కుమారుడ'
వని పల్కెను;

'ఒకనా డీ
వేనా నా
సకియవు ? ఏ
మరి' తంటిని,

'ఒకనా డీ
వును మానవ
సుకుమారిక
వా ?' అంటిని.

'కలకాలపు
ప్రేమలు భూ
తలమున లే
వా!' అనియెను,

'సురలోక
ప్రణయము మా
నరులకు దెర
మరు' గంటిని!

*　　　*

'కవి హృదయ
మ్ముల కైనను
యవనిక లు
న్నే?' అన్నది,

'కవులకు భూ
లోకములో
కలత నిద్దు
రే!' అంటిని.

'ఓ మర్త్యక
పీ! నిష్ఠుర
భూమి నెగసి
రాలేవో?'

'చుక్కల రా
ణీ! ప్రేమల
రెక్క ద్రుంచు
నీ జగమ్ము!'

*　　*

'నా చిరంత
న ప్రేమము
నోచలేదా
సాఫల్యము!'

'ఖేచరికిని
భూచరునకు
సాహచర్య
మెన్నటిదో?'

*　　*

తారా కో
మలి కన్నుల
జారె నొక్క
బాష్పకణము —

తారా కో
మలి సిగలో
తరిగె నొక్క
పుష్ప దళము —

నా విస్మృత
జీవితాన
నలిగి రాలె
ఆ దళమ్ము !

నా యస్వ
ప్నపు టూహల
నడగిన దా
సౌరభమ్ము !

## 'సీత' కు ......

ఆ యశోక తరుచ్ఛాయ నలసి, ఛాయ
రూపు గొన్న విశీర్ణ స్వరూప చిత్ర
మదియ నా స్మృతిపీఠమ్ము నాక్రమించు!
అదియ నీరవగీతమై ఆలపించు!

ఆర్తివిదళిత! గంభీరమూర్తి! ఓ త
పస్వినీ! ఓ రహోవ్యథా బాష్ప తప్త!
దివ్య పరిదేవనమున రోదింప వేల
నీ యగాధ హృదయ శోక నిర్ఝరములు?

హోరని కలంగు నంబుధి వారి ఘోష
నీరవ సమాధి నడగు నీ ఘోర తాప
ముగ్ధ నిశ్వాసమ్ములు మున్గిపోయి
మాటుమణగినవా? శోకమహిత, సీత!

# ఆ మె కే ...

౧

శోక మేఘాలందె స్రుక్కెదో, నీకు
నాటపట్టో యిప్పు డానంద వాటి?
నా గుండెలం దొక్కనాడు నీ మూర్తి,
నీ వ్యక్తి, నీ శక్తి, నిలిపి పోయితివి.

ఆనాటి నీ మందహాసము లన్ని
నిట్టూర్పు సెగలచే నిరసన మొందె,
ఆనాటి నీ కన్ను లందుండు తళుకు
బెళుకులు బాష్పాల బేలవోయినవి;

పూత గౌతమి తల్లి పొగిలి పోయినది
నీ హృదంతికమఃలో నిశితార్తి నెరిగి!
నాటి నీ యభిమాననష్ట మీక్షించి
క్రుంకెడి తరణికే గ్రుడ్లెర్రబారె!

ముక్తకేశ, విముగ్ధ, మూర్ఛితగాత్ర,
అపమానభర వినమ్రాత్మ, బాష్పార్ద్ర,
ఆమూర్తి నా యెద హత్తితి వపుడు,
గౌతమీతటినె, ఆ గౌరార్క ద్యుతినె!

కాల గాంగఝురమ్ము కట్టుగ నిల్చి,
నీలకంఠువలె కరాళ విషాగ్ని
నా గళమ్మున దాచినాడ నిన్నాళ్ళు,
నీకే శుభమ్ము లన్నియు నివ్వచేసి;

నా ప్రాంగణమ్మున నడుగిడలేదు,
అడుగనేలేదు నా యెడదలో తావు; —
ఎడనెడ స్మృతివీథి బడిసాగు నాటి
మంచుకన్నీటి తామర నీ వదనమె!

ఎన్ని తలపులో నీ మన్నన గోరె,
ఎన్ని పిలుపులో నీ తెన్నున బారె;
నీ సుఖశోకాల నిర్మగ్న వైతి,
కన్నెరో! నన్ను నీ వెన్నలేవైతి:

జితశోక గీతికాంకిత కావ్య తంత్రి
కల కలధ్వనుల లోకాలెల్ల దనియ,
కాలకాలాల నే నాలపించుదును,
నా కావ్యమాల నీ స్వీకృతమేని!

నాకు లేదు సౌందర్యమ్ము, నాకు లేదు
మాధురుల జిమ్ము మోహన మంజు గళము ;
నాకు లేదు నీ కన్నుల నవయజేయు
చిర వినూత్న వసంతరోచిస్సు— నాది
యైన ఏకాకియెదయు నీ హస్తగతము !

నా కభావమా నైశ్వర్య లోక మెల్ల
నీ రుచిరమూర్తి లోననే నిబిడమయ్యె —
నాదియా సుహృల్లేశము న్నన్ను వీడి
నీ కొరకె రెక్కలార్చుచు నిన్నె చేరె !

నన్ను నా జాలియెడద గన్గొన్న నీకు
నెన్నడేనియు గరుణ ప్రసన్నమానె ?
నన్ను గరుణ దలంచు నీ కన్నుదోయి
నెన్నడేనియు బ్రేమ రేకెత్తకున్నె ?

నాకు మిగిలిన యేకాంత శోకలవము
శూన్యత నెదిర్చి దిగ్భ్రమించుకొని పోవు; —
నీ హృదయవాటి ముంచెత్తు నీర వార్ద్ర

నిష్ఠుర రహస్యసంభృ తోత్కృష్ట దుఃఖ
భరిత నిశ్వాసములనేని బంచి నాకు
శూన్యతను నించి, యోదార్చి, సుంతయేని
నీ హృదయభార వహన సన్నియతి కూర్చు
తృప్తి నొసగుము; ఆశ తత్తృప్తి లోనె
మోసులెత్తుకు, పూచి, సంతోస మొదవు.

## ౩

నాకు దుఃఖమ్ముకై తృష్ణ లేక గాదు
ఇంతకాలము సుఖము వహించి యుంట :

నాకు ప్రియసఖి, దుస్సహా శోకలోక
రాజ్ఞి, యెపుడేని తాన తద్రాజ్యభార
పట్టభద్రత నొసగి మద్భవ్య శీర్ష
మే శుభోజ్జ్వల వేదనోష్ణీష రత్న
చిత్ర రోచిస్సులందొ ముంచెత్తు ననెడు
నిశ్చలమ్మగు విశ్వాస నియతి జేసి
వేచియుంటి సుఖాంగణ వీధికలనె,
ఎట్టెటో కవినై రెక్క లెగసికొనుచు!

ఆమె ప్రేమార్ద్ర గారవాహ్వాన గీతి
నేడొ రేపొ దిగంతాల బాడి పిలుచు —
అంతవర కుందు నీ సుఖ ప్రాంతములనె,
రెక్క లెగయుచు గడియలు లెక్కగొనుచు.

ఏను కవినంచు సకియ తా నెరుగు, నిజము :
నాకు పక్షముల్ సుఖమొందు, శోకమొందు;

నా సఖి శోక భరణమ్మె నా సుఖమ్ము
నాకు దుఃఖమ్ము నిజసౌఖ్య నటనయందె,
నా కిపుడు భారమైన ఏకాకి సుకమె
దుస్సహా మటం చెరుంగు నస్మత్సఖియును!

కవుల సౌఖ్యమ్ము దుఃఖాన నవును పక్వ,
మవును పట్టాభిషిక్తత యపుడె శోక
లోక సింహాసనమ్మున నాకు గూడ —
మస్తకమ్మున సఖియె తా మకుట మిడును.

నేడొ రేపొ దిగంతాల బాడి పిలుచు
నామె ప్రేమార్ద్ర గారవాహ్వాన గీతి —
వేచియుందు సుఖాంగణ వీధికలనె
ఎట్టెటో కవినై రెక్క లెగసికొనుచు!

నీవి నిష్కల్మషమ్మగు నిడుద యూర్పు
లార్ద్ర దుఃఖభరమ్ము లనంత భావ
బోధకమ్ములు బాధా ప్రబోధకములు,
అవియె సుమి నాకు నిశ్చలాశావహములు,
అవె యగును నీకు నాకును నైక్యదములు.

నీవు నా యెట్టయెదుట కన్నీరు రాల్చ
బాష్ప సంతతినే కూర్తు పుష్పమాల!
నాదు చెవిసోక నీ ముక్త రోదనమ్ము
తచ్ఛ్రుతుల మేళవింతు వేదాల ఋక్కు!

నా హృదయమందుఁ దోచ నీ నగ్న శుభ్ర
శోకసంతప్త శోభన శుష్కమూర్తి,
అర్ధరాత్ర తమస్సు, మధ్యాహ్న వహ్ని
సాంధ్య శోణిమ, వారిధి సాంద్రనీల,
మింద్రధనువులు, నిర్మల చంద్రకాంతు
లిమిడి నీ దివ్యమూర్తి నిర్మించు నాకు!

కవికుమారుని కన్నీటికాల్వ లందు
స్నాత యాగాత నీ దుఃఖపూత రూప,
మంత బూర్వాశ శోణప్రశాంత ఝురుల
మున్గి తేలు నుషఃకన్యమూర్తి దాల్తు!

తరుణకవి కన్నుతామర లరసి యరసి
నీ కపోలమ్ము లరుణిమ నిండు గాత,
అందు ప్రణయ సల్లాపమ్ము లాడుకొంద
మీవు నేనును రక్తిమలీను భాష!

కవుల జత యౌద మీవు నన్ దవిలి రమ్ము —
పక్షముల రెంట నూగుచు బరచిపోద
మీవు నేను వెలుంగులో యిరులో, సొచ్చి
కవికిశోరుడ నేను! నా కవిత వీవు!

# స ఫ ల త

బంధనమ్ముల విదిలిచి, యంధ లోక
మే విడిచి, ఏకతమ్మున నిర్వారము నె
డంద నందనసీమల యందె మసలు
నాడు, నా యాశయమ్ములు నాట్యమాడి
నీ గళస్వర మాధురి నేకమై న
దించి, సఫలిత ప్రేమ దీపించు నాడు —
ఆ సుదూరముహూర్త సుఖాప్తి నాడు —
నీవు నన్గాంచ కన్నార నిన్ను నేను
గాంచి ప్రేమించు జ్ఞానప్రగాఢ వీక్ష
ణ క్షణమ్ముల నాడు — ఆ నవ్వుపూల
నాడు — చంద్రుడే చుక్కల వీడి యాడు
నీ వదనసీమ! ఇంద్రుడే నీకు నాకు
నాక రాజ్యాభిషేక మ్మొనర్చి వీడు
దేవ సింహాసనమె కవితా వధూటి!

# ఏ నా డు?

ఏనాడు నీ మోవి
లేనవ్వు పొలుచునో,
ఏ రేయి తారకల
నీ చేయి మలుచునో,
ఏ ప్రొద్దుపొడుపులో
నీ ప్రేమ మొలుచునో,
ఆనాడు ఆ రేయి
ఆ ప్రొద్దె రేకెత్తు
నా వాడువారు గుం
డెల లోని పూగుత్తి!

మరిగి కష్టపు టలల్
విరిగి తుంపుర లౌను,
వేగి నీశ్వాసముల్
పొగు తుత్తునియలై,
మొయిలు కడుపున దాగు
మయిల కన్నీరపుడు,

అప్పుడో చిరునవ్వు !
అప్పుడో చిగురాక !
రెప్పపాటున ముద్దు
లప్పగింతును నీకు !

*　　　*

గాలిలో, రెపరెపల్
తేలి వచ్చున దెప్పుడు —
ఏ తమస్సుల కొసల ?
ఏ యుషస్సుల దెసల ?

నింగిలో చుక్కలో
తొంగి చూచు సువార్త
చెంగుచెంగున వచ్చి
మ్రింగు నాదు నిరాశ

నెప్పుడో చిరుకన్నె ?
చెప్పవా చిరుకన్నె ?
చెప్పవా, చెప్పవా,
చెప్పవా చిరుకన్నె ?

# అ భి సా రి క

బంగారు నా హృదయ
పద్మాలయమ్ములో —
సందె చీకటులలో
స్వర్ణ పల్లెరములో,
కలువరేకుల కనులు
కన్నీటి ముత్యాలు
తళుకు చెక్కిలి నిండు
వలపూరు కెమ్మోవి
వెలలేని వింకెన్నొ
థళథళలతో దెచ్చి,
ప్రేమ యూర్పుల నెగయు
నీరాజనము నుంచి,
నీ కొరకె వేచితిని
నీప శాఖల క్రింద —

నా పతీ! నా పతీ!
తాపమున దహానమై
పోకమునుపే వచ్చి
స్వీకరింపవా నన్ను?

* *

మురళీ మధుర గాన
రవళి దేలుచు వచ్చి
నా హృదయ పద్మాన
నధివసింపుము పతీ! —
చిరునవ్వు లప్పుడే
చిప్పిల్లు నా కనుల!
హర్షాశ్రువులె యప్పు
డౌను ముత్తెపు సరులు!
తళుకు జెక్కిలి, నిండు
వలపూరు కెమ్మోవి
కరగిపోవును నీదు
మరుగు కౌగిలి లోన!
ప్రేమ మలయానిలము
పరిమళించును! నాదు

నీరాజనపు కాంతు
లావరించును నిన్ను! —
బంగారు నా హృదయ
పద్మాలయమ్ములో,
సందె చీకటులలో,
అందియల రవళిలో,
నా పతీ! నా పతీ!
నీ మరుగు కౌగిలిని
నే కరిగిపోదునో!
నే సురిగిపోదునో!

# పున్నమ

కదలు పిసాళిగాలి తరగల్
విరబోసెడు నారికేళపుం
దుది మృదుశాఖలఁ వికసితుండవు,
చంద్రుడ! పండువెన్నెలల్
చిదిమిన దూది వోలె విరజిమ్మి
దరస్మిత శుభ్రకాంతివై
పొదలెద వీవు! నా యెదయు
పొంగులువారెడు నేటి పున్నమఁ.

ఏ సఫలీకృతాశయము,
లే వికసిల్లు మనోరథమ్ము, లే
యాసలు, నే ప్రమోదము, సుధామల
మూర్తి! వరించె నిన్ను, శో
భాసిత పూర్ణిమా మృదుల
ఫాలతటీ తిలకంబ వైతి! నీ
హాసములే మదంతర విహాయస
మందున గూడ బ్రాకెడిన్.

ఎద కలశంబులో సుధల
నించుకయించుక జాలువార్చి, యం
బుదముల వెండిదారుల న
భోంతర సీమల జల్లచల్లగా
కదలుచు దేలు నో రజనికాంతుడ!
నాదు పునీత భావనా
పదములు గూడ నీ సిత శుభస్మిత
శీకర సేచితమ్ములే!

మలయ సమీర సంభ్రమితమౌ
ప్రకృతిప్రమదా వికీర్ణ కుం
తలముల పోల్కి నింగి లలితమ్ముగ
నూగిలు నారికేళ శా
ఖల గగురీని తారెడు మృగాంక!
మదీయ విశాల జీవనాం
చలములె నీ సుధామధుర
చంచల చుంబనకేళి సోలెడిన్!

# ఉజ్జీవనము

కటికచీకటి గుండె కరగెనో యేమొ —
ఒక లేత వెల్తురు వికసించె నాకు ;
మాయమగు మహదాశ మరల రేకెత్తి
దరిలేని నా దారి తిరిగి త్రొక్కించు !

భయద జీమూతమ్మె నియమించె నేమొ —
ఒక్క తారక నింగి నొదిగి నర్తించు ;
అణగిన కోరిక లంతంతె లేచి
తెలియని నా యాత్ర సలుప బుత్తెంచు !

హోరని వీచు సమీరమ్మె యేలొ
వింతరాగము నాలపించెడి శ్రుతుల —
వాడిన విరహమ్ము వాడియై మరల
ఆగిన యన్వేషణార్థమ్ము లేచు !

నీరసించిన జీవధారయే నేడు
చీకటి దారినే, శోక తారకనె,
గాలిలో పిలుపునే కని మేలుకాంచె —
చేరువో దూరమో చేరును అవధి !

# విరహా విజయము

'కువకువ' మని కూాయు చక్రవాక మిచట,
'కూాయి' మనుచు చక్రవాకి రోయు నెచటో —

పిలుపు పిలుపులో కలియును,
తలపు తలపులో కరగును,
నును వెన్నెల జలనిధియే
తనువు తనువు నెడ సేయును—

దూరదూర మగు పిలుపే ప్రేమ నిలుపు !
దూరము విజయించు పలుకె దారి దెలుపు !

*　　　　*

'మినుకు మినుకు' మని వెదకును వేగురిక్క,
'విల విల' చలియించును దిగిపోవు చుక్క —

వెండి మొయిలు మైదానమె
రెండిటి దూరము సేయును,
తడసి తడసి తార లేని
ఎడనెడ దవ్వుల పొలగు —

ఎడబాటున కెర యగునే నక్షత్రము !
ఎడద వలపు నరికట్టునె దిక్చక్రము !

*　　　　*

మావి యిగురు రెమ్మ వ్రేలి నిట్టూర్చును,
కోయిల ఆమని చన నాక్రోశించును —

గొంతు చివురు నాశించును,
'కోయి' 'కోయి' మను కోయిల,
మనసు కోత పాలయి నన
కనలి కనలి రాలిపోవు —

రాలిన చివురాకు కోర్కి రాగిల్లదొ ?
నిత్యవసంతము శీతువు నిర్జింపదొ ? —

చిగురు తిరిగి మొలకెత్తుకు చిందులాడు !
వగరు మేసి పికకంఠమె వలపులూరు !

# ఆ శ

రేయి కౌగిలిలో కృశించిన
ఈ మెడందను, వ్రాలిపోయిన
ఈ మరందవిహీన హృత్సర
సీరుహంపు దళమ్ము లందున,

ఓ యమాయిక బాల ! నీ శో
భామనోహర మందహాసము
కోరి పంచు సువార్తలే సుమి
సీరసింపక నిల్చిపోయెను !

*　　　*

కారుకాటుక చీకటులలో
మారుమ్రోగు నిరాశ ఘోషల,
ఆరిపోయిన ఈ మెడారుల
దారిలో జీవ స్రవంతిని,

ఓ యమాయిక బాల ! నీ నయ
నోత్పలమ్ములలో నటించెడు
తళుకులే అభయ మ్మొసంగెడి !
వలపులే ప్రవహించి సాగెడి !

ఠా

# అదృశ్య

సగము వెన్నెల, సగము చీకటి,
నిదురలోనే కదులు స్వప్నము,
నీడలో దాగున్న పుష్పము,
నీ స్వరూప మదృశ్య ప్రేయసి!

నీలి కన్నుల దేలు సైగలె,
బెదరు పెదవుల మెదలు పిలుపులె,
కలగు హృదయము వలచు కోర్కెలె
పరప వెరతువు, బేల ప్రేయసి!

సందె గుసగుస లందె వింటిని
సకియ! నీ ఏకాంతములు నే;
వెలుగు చీకటు లందె నీకయి
వెదకు చుంటిని, వేచి యుంటిని!

తెలిసి తెలియని వలపు వేకువ
కలిసికొంటి మొకప్పు డిరువుర ;
మొంద గోరితి నిన్ను ప్రేయసి,
అందకుండ నదృశ్య నైతివి!

రాం

ఊహా లందే ఉనికి చేసుకు
సాగు నీ తొలి స్వప్నరూపము;
వెన్నెలలలో కన్నెమబ్బువో,
నీడవో, నిట్టూర్పువో?

ప్రణయ ముకుళము పూచి దాగదు,
వలపు వాసన వెల్లివిరియును,
కలగు స్వప్న ముషోదయమ్మున
వెలుగు రూపై విస్తరిల్లును!

స్నిగ్ధమే నీ ప్రేమ, సకియా!
ముగ్ధవై ఎన్నాళ్లు దాచుట?
మంచు తెర, తొలిసంజ ప్రేయసి!,
చించుకుని పుష్పించవమ్మా!

# వి ర హ వీ ణ

దూరమే నిన్ను నన్ను సుతారమైన
వీణ తంత్రుల సమ్మేళవించె నేడు :
నా గభీర శ్రుతి రణన్నినాద మందు
నీ విమల రాగ రేఖలే నిలిచి నిలిచి,
దేవి ! భరమా నెదో భావ మావహించి
లోక లోకాల నీ నిశ వ్రాకిపోవు !

ఓ మధుర గానజీవి ! నాదోర్మి లేవా
పొంగి యుప్పొంగి, ఈ రేయి బొరలిపోయి,
ఇచటి నా హృదయమ్మునం దెచటి నీ యె
డందనో నించి, పూర్ణత నొందజేయు !

ఓ ప్రియా ! రాగమాల లేవో స్ఫురించి,
విరహవీణా గళమ్మున విరిసి, నేడు
దూర తీరమ్ములనె మంజు సౌరభాల
సంస్పృశించు విశాల ప్రశాంత రాత్రి !

# ఓ రు గా లి

ఈదురు మని ఓరుగాలి
పాదప పత్రముల నొరసి
ఏదియొ యున్మాద మురళి
నూదుకొనెడి తనకొరకే !

నిశ్శబ్దము — నిశీథమ్ము —
నిల్చిన లోకపు సందడి —
కన్ను చొరని కారు తమసు —
కదలాడని సుప్త ప్రకృతి !

* *

నా జాగ్రజీవ మొకటె
నట్టాడెడి నెటకెటకో,
చిక్కువడిన స్మృతి వీథుల
చిగురు తలపు లేవొ పిలువ !

ఏ లలితామోద భరిత
చేలాంచలమో విసరెడి
నా హృదయము నంటెయంటె,
నాపరువిడు తలపు లంటె !

* *

కల లందే కాంచిన యే
కామిత సౌందర్యాణువో
దరహాసాలోకముతో
విరియించెడి హృత్సుమమ్ము !

మొరసెడి మారుత మురళీ
పరవశ యీ ప్రకృతిలక్ష్మి —
ఊహాల చలియించు వలపు
లాహరించె నా ప్రశాంతి !

# పిలుపు

ఏ నీ నిశీథమ్ములో మిళితమైనాను
వాన చప్పుళ్ళు నాలో లీనమైనాయి —

నక్షత్రములు నింగి నశియించి పోయినవి,
సాక్షాత్కరించె నెల్లెడ తమోజీవమ్ము !
ఈ క్షణమ్మున నా నిరీక్ష నిబిడచ్ఛాయ
పక్షముల్ సాచి విశ్వాచ్ఛాదన మ్మౌను !

అజ్ఞేయమా నే యపారదూ రానంద
విజ్ఞానమయ జగద్వీథీ నివాసి అ
స్మ జ్జీవితేశ్వరీ మస్మృణార్ద్ర భావనల్
జాజ్వల్యమాన సంజ్ఞల బంచుచున్నవో !

అంతరంగమ్మునం దా తటిత్సంజ్ఞా ని
మంత్రణమ్ము స్ఫురించు నంతే — బాహ్య జగద్ది
గంతరమ్ముల వృష్టి వింతచప్పుడు, శాంతి,
అంతే...... ......

# జ య వ సం త ము

కలకల మని వికసించిన
కమల కోరకములో
నిలిచి మ్రోగు నవ వసంత
జరా పరాజయ శంఖము !

కదలి నృత్యమాడు పచ్చ
కన్నె గన్నెరులలో
సదియించెడు సమరీమణి
ఘన కాంచీ ఘంటికలే !

తేనెలూరు కోమల మం
దార గర్భములలో
త్రిదశుల పద లాక్షా ర
క్తిమమే ద్రవమై పొంగెడు !

ఈ వసంత మృదు మందా
నిల సుగంధములలో
ముగియ బోని, ముదిమి లేని,
వలపు తలపులే మలయును !

# పూర్ణిమ

ఆరబోసిన వెన్నెలలలో
ఆడుకుందము ప్రేయసీ!
విరజాజి మల్లెల ప్రేయసీ!
కరవీర పువ్వుల ప్రేయసీ!

రాకాశశాంకుని గాజునవ్వుల
నేకమాయెను ప్రకృతియే!
ఆకాశపుష్పము లెన్ని విరిసెనో
అన్నిదిశలను ప్రేయసీ!

చెట్ల నీడలు చెంగు చెంగున
చెమ్మచెక్కల చొక్కెనే!
ఈ పిల్లగాలుల ప్రేమ వార్తలు
వెల్లివిరిసెనె ప్రేయసీ!

గడ్డిపువ్వులు గాఢ ప్రేమల
గాగిలించుకు పోయెనే!

ఈ దూదివెన్నెల సెజ్జ నిద్దుర
పోదమే, రా! ప్రేయసీ!

మబ్బుదొన్నెల సుధను గ్రోలుచు
మరచిపోదమె దేహము!

మన తేనె ముద్దుల, గాగిలింతల
దేలిపోదమె ప్రేయసీ!

# సరోజిని

ఆమె దివ్యాంబుజ సుమమ్ము, ఆమె రక్తి
లుదయ రాగ రోచిస్సుల నుజ్జ్వలించు ;
తావుల దిగంతరాళమ్ము లావరించు
నామె సాంధ్యసరోలక్ష్మి నోముపంట.

అపుడపుడె సుప్తి మేల్కాంచు విపుల నయన
దళము లరవిచ్చి, లోకాలు బులకరింప
అభినవ విలాస కోమల ప్రభ వెలార్చి
తరుణ మధుప సమూహా సంవరణ మయ్యె !

ఆమె పొంగారు విరితేనె లానవచ్చు
తేటిగమి లోన కడసారి తేటి నేను ,
పరువు మాని పాటయె మాని తెరచికొన్న
తరుణ జీవమ్ముతో నామె దరిసినాడ.

నవ విలాస లాస్యమ్మున నరుగుదెంచి
రితర భృంగ కుమారకు, లే నొకండ
గమల వనమున కూనరాగము నడంచి
మంద మందపు టాస బిరుంద బోతి.

మెరుగు రెక్కల తుమ్మెదల్, మేలిపాట
జెలగు తేంట్లు, తేనియ నిధుల్ కలుగు నళిన
మాజములు గొల్చికొనె నా సరోజరాజ్ఞి —
ఏ నొదిగి మీటికొంటి నా 'ఏకతంత్రి' !

ఎద సొలసి వ్రాలు సుమ విరహిణుల కథలు
జాలి పదజాలమున గీతమాల లల్లి
వెఱ్ఱి గాలి సొదలతోడ విపిన వాటి
నాలపన సేయు పాంథ గాయకుడ నేను !

కమల వనమున గనుల దిగ్భ్రమ మొసంగు
విమల గంభీర సౌందర్యసుమముఁ మ్రోల
నడగి మడగు నీ పాంథ గాయకుని నేడు
పూలరాణి నెమ్మది దలపోయు నేలో ?

ఝుంకృతుల ద్విరేఫములు రంజనము గొల్పు
గొలువు కూటాన బద్దిని చెలి మృణాళ
నిలయమున వేయి రేకు కన్నులను విరిసి
నీరవుని న న్నరసె నిట్టూర్పునీరు కాగ ! —

"ఓ యువ మధువ్రత కుమార ! ఊహ లల్లు
నీ సుమధుర తంత్రీ రణ న్నినదములకు
మామకీన సుధాపూర్ణ మానసమ్ము
రాగ సంబద్ధమై పాట నాగి వినెడి !

"కన్ను లరమోడ్చి విస్మృతి గర్భసీమ
లారసి తెరచి లోలో గాధ లొక్కటొకటె
సంచల దీర్ఘ నిశితాంగు ళాంచలముల
'నేకతంత్రిక' నీ వేల నేకరింతు ?

"ఎన్నడో నిద్రలో మున్గియున్న కలలు,
పూర్వజన్మ ప్రణయ సానుభూతు లేవో,
సుఖ జలధిలో నడంగిన శోక రాగ
మేమొ నీ యంగుళులు పెల్లగించు నేడు !

"ఓయి మధుకర ! నేడు నీ వీ యగాధ
సంస్మరణ శృంఖలల నిట్లు సంతరించి,
కైవసము చేసికొంటివి నీ కమల వనము,
అన్య దుర్లభమైన నా యాత్మ గూడ !"

# సింగారము

ఒక పువ్వు
నీ సిగకు
నగమై సు
మించినది —

ఒక పులక
నా మెదకు
వగమై భ్ర
మించినది !

*

ఒక తళుకు
నీ చెక్కు-
లకు శోభ
కూర్చినది —

ఒక ములుకు
నా గుండె
లకు సోకి
పర్చినది !

ఒక పలుకు
నీ పెదవు
లకు వెనుక
దాగినది —

ఒక ఆస
నా బ్రదుకు
నుక మాహా
రించినది !

# ప్రేమ ఝంఝ

మింట మండెడి రిక్క
కంటి కిరణాలలో
ఏ మహాశయము ధూ
మాలు చిమ్ముచు రేగి
లోకాల ముంచెత్తి,
నీకు నాకును మధ్య
భీకర ప్రేమ ఝం
ఝా కరమ్ములు సాచి
రేచునో? దివ్య వి
ద్యుల్లతా పుష్పాలు
పూచునో మన మధ్య?

*　　　　*

ప్రాణప్రియా! నేడు
నీ హాస విద్యుత్తు
కంటి రెప్పలు విప్పి,
మింటి మంటిని గప్పి,
తారకా మణుల వ
క్షో హారముగ దాల్చి
మేర మీరిన కామ

భారమ్ముతో మంద
యానాన కడల సం
చారమ్ము జేసెడిని!

*          *

ప్రాణప్రియా! మండు
నా నాడులం దగ్ని
కీల లెన్నెన్ని యు
జ్జ్వాల నీరవ ప్రేమ
లో మూగవోయి నీ
కై కనలు చున్నవో! —

నా మూగవోవు ర
క్తము ముక్తమై వహ్ని
ధారగా బారి, నీ
లో లీన మైనప్పు
డో ప్రేయసీ!, నేటి
నీ భయానక హాస
మీ ప్రేయసుని గుండె
లో ప్రతిధ్వనితమై,

ఏ మహాశయ ముక్త
జీవ గానము రేగి,
యుగ యుగమ్ముల కాల
గగనాల మ్రోగి, అం
బుధి ఘోషలో సాగి,
విధినే హసించునో ?
ప్రాణప్రియా !

# సుందరమూర్తి

నా విరహానుభావము లనారత మారడివెట్ట,
నీ సుధా
భావనలందె నింగి దెస బర్వులు వారుచు
నాసగొన్న గీ
తావళి మూగ గొంతుల విదల్చి భరమ్మయి
పోవు నీ నిసిఁ,
దేవి ! భవత్స్వరూప శుభ తేజమె పో
విరియించు వెన్నెలల్ !

ప్రేయసి ! నీ సుధా మధుర పేశల హాసము
పుచ్చపూవులై
పూయగ, మంధరానిలము పొల్చెడు నీ వన
సీమ చిందులా
చాయల చాటుచాటున ప్రచారము సేసెడి
రీతి దోచి యో
మాయసఖి ! కనుంగవకు మాటు బొనర్తు గదే
స్వరూపమున్.

భావి సుఖాసుఖమ్ముల విపర్యయముల్ దలపోయు
నా స్వభా
వావృత భావనా నిచయ మావల ద్రోచి,
మదీయ జీవన
స్థావరతన్ మది న్నిలిపి, తావక దివ్య
ముఖారవింద సు
శ్రీ విభవమ్మె నే డభిలషించితి నంతియ సుమ్ము
నెచ్చెలీ!

భావనలం జరింతువు, విభాత విభావరులం
ప్రశాంత శో
భా వరణీయ మూ_ర్తివయి భాషణ మాడెదు
నా యెదన్ మధు
ప్లావిత గీతమై కరగిపారగ జీవిత మెల్ల,
గాని లో
కావరణమ్ము నంటని త్వదాదరణ మ్మెటు
చూరగొందునో ?

నీ సహాకారమే కలుగనిచ్చితివో, ప్రణ
యాలయంపు జ్యో
తీ ! సువిశాల విశ్వప్రకృతి ప్రమదావన దీప్తి !
నా సము
ల్లాసిత గానవాహిని, యిలాతలి తెప్పలదేల,
ప్రేమ వి
శ్వాస వికాసమా హృదయశాంతి ధ్వనింపదో
దిక్తటమ్ములన్ !

నీ కొరకైన యీ విరహ నిర్భర వేదన
నా యెడంద చే
రాకలి రేప, దేవి !, భవదాకృతి నూహాల
రేఖలందె బిం
బీకృతముం బొనర్చి, వినిపింపగ నాశయ మూరి
నేటి శో
భాకరమైన వెన్నెల విపంచిక తంత్రుల
మీటి పాడెదన్ !

సుందరమూర్తి! ఈ రజను శుభ్ర వధూవసనమ్ము
దాల్చి జ్యో
త్స్నేందిరవై భువిం దిగి, యనిందిత కాంతి
విరాజమాన హ్మ
స్యందిర మందె మద్దెళ సుమంగళ గీతరవమ్ము
నించికొ
మ్మందెల నిక్వాణమ్ముల లయన్ నటియింపుము
సమ్ముఖమ్మునన్!

# తొలకరి

కఠినమా నీ యెడంద, ఓ కన్య!, నేడు
కరగి ఆమని జల్లుగా పరిణమించె,
ఎన్నినాళ్ళాయె నీ లేత చిన్ని నవ్వు
చిరు మెరుపు సైగలో చిట్లి చిందులాడి!

నిరత ప్రేమపిపాసువై మరిగి మరిగి,
కను మొరంగిన ప్రేయసికై తపించి,
నేటి ఆమని సందె నీనాటి కేని
తొలకరించిన ప్రియురాలి చెలిమి గంటి!

ఝురఝుర నినాదముల నింగి జలదపాళి
రెప్పపాటున జడ లెల్ల గప్పివైచె —
పృథివికి దరించు నే దివ్య రథ నినదమొ
నీల గగ నాంతరాళాన నిధ్వనించె!

అమర నిత్యవసం తోత్సవముల వీడి
నా చిరంతన ప్రేయసి నన్నె కోరి,
జలద సోపాన పంక్తుల జంచలించి,
అవతరించె నీ మర్త్యలో కాంచలముల!

చిర విరహ దహ్యమానమై శీర్ణమయ్యె
నా నిగళ బద్ధ జీవన నౌక నేడు —
నీ తొలకరి స్రవంతుల నిల్చి తేలు
నో ? సుఖాతిరేకాన మునుంగు నేమొ ?

చిర నిరీక్షానలమ్మున గరగి కరగి
నా సుతీక్ష్ణ రక్తారుణ నయన యుగము
విద్యు దుజ్జ్వల తావక వీక్షణ స్ఫు
లింగముల నైక్యము భజించి లీనమౌనా ?

# సామ్యము

లేత లేత తీగె వోలె పూత పూచెను,
తేనెలూరు చిన్నిపూలు తేరి చూచెను ;
మంద మలయవాయు వోలె మలసి వీచెను,
అందమైన పూలు తమ సుగంధ మొసగెను.

మినుకు మినుకు చుక్క వోలె మింట దోచెను,
కనక కాంతి నెల్ల దిశల బలుకరించెను ;
అంతు లేని ఆకసమ్ము ఆవరించెను,
సంతసమ్ముతోడ తార సఖ్య మొసగెను.

క్రొత్త క్రొత్త కోకిలమ్ము కోన సొచ్చెను,
మత్త మధుర గళ రవమ్ము నెత్తి పాడెను ;
గున్నమావి ఎర్ర చివురు సన్న లొడ్డెను,
చిన్ని కోకిలమ్ము మావిగున్న జేరెను.

అందమైన అబల యొర్తు అవతరించెను,
సుందరాంగి యౌవనమ్ము జూరగొన్నది ;
నవ్య భావకవి యొకండు కావ్య మల్లెను,
కావ్య జాల మందు వయసుకన్నె చిక్కెను !

# యుగలక్ష్మి

యుగయుగాల్ నీ రూపు పొగడుకున్నానే
ఎన్నెన్ని స్వర్గాలో తన్ని వచ్చానే
నీ పాద మంజీర నిక్వాణములనే
దూరాన విని చెంత జేరుకున్నానే

యుగలక్ష్మి ! సుఖలక్ష్మి ! అగుపించినావే !
అగుపించి మాయమై ఆర్తి పీడకవే !

ఎన్నెన్ని జ్యోతులో నన్ను పిల్చాయే,
అన్ని ఆరిపివేసి, నిన్నె వలచానే !
కాల వార్ధికి నేను కట్ట కట్టెనే,
నా లోని నీ రూపు నట్టె నిల్పెనే !

అన్ని విద్దెలు నిన్నె ఆవరించేనే
అన్ని సుద్దులు నిన్నె ఆలపించేనే
విశ్వకర్మే నిన్ను 'విగ్రహించేనే'
ఆదికాలపు సృష్టి అధిలక్ష్మివేనే !

భూమి నీకయి పుణ్యభూమి అయ్యింది,
లేమి నీచే నాకు సేమ మయ్యింది —
కామితార్థ మ్మింక కడతేర్ప రావే,
ప్రేమ కోసమె నన్ను ప్రేమించుకోవే !

యుగలక్ష్మి ! సుఖలక్ష్మి ! అగుపించినావే !
అగుపించి మాయమై ఆర్తి పీడకవే !

# అమరత

ఈ బ్రదుకున విఫలమైన
ఈప్సితములు స్వర్గ సీమ
మరల పూచి సఫలీ కృత
మై విలసిల్లున్.

ఇంకిపోయి నా కందని
ఈ లోకపు సానుభూతి
నందనవన మందె సుధా
నదమై పొంగున్.

వెలిబుచ్చక వాడిన యీ
వలపు కోరికల రేకులె
అప్సరసల కంఠమాల
లం దసియాడున్.

యౌవనముననే జీవన
యాత్ర సాంతమై చెల్లిన,
అజరుడనై త్రిదశు లందె
ఆకృతి గాంతున్.

సౌందర్య జగత్తు లోని
సత్య మిప్పు డెరుగకున్న,
అమృత మ్మానిన యప్పుడె
అనుభావ్య మగున్.

# ప్రతిఫలము

అందని ఒక చిరునవ్వును
పొంద గోరె నొక కోరిక,
ఆశా హస్తము లెత్తుకు
అలసి, అలసి, నిదురించెను.

కికురించిన ఒక చూపున
కొక యెద బొమ్మము రాల్చెను,
వెదకాడెను, వెత బొందెను,
వేచి వేచి, నిట్టూర్చెను.

దూరపు కల నొకదానిని
జేరబోయె నొక మహాశ,
భావాంచలముల నంటుకు
పరచి పరచి, కృశియించెను.

నిద్రించిన కోరికనే
నిట్టూర్చిన హృదయమునే
కృశియించిన పేరాసనె
క్రుంగిన దీనుని ప్రేమనె,

తెలి మబ్బుల వలువలతో
తారా మణి హారముతో
వసివాడని వలపులతో
విరిసి, వలచె నొక యచ్చర!

# ఎంత కాలము?

ఈశ్వరీ! నా వనాన అనశ్వరములు
నవ సుమమ్ములు పూయించినాడ నేడు,
దండ దండలుగా గ్రుచ్చి తావకీన
పూత భావనాకృతి కంఠపూజ సలుప!

ప్రేయసీ! నీకు లతకూన దోయిలింత
లందు మధువులు పుష్పోడుల్ పొందుపరచి
నిలుపుకొని యుంటి; ఎన్నాళ్ళు తలపు తెరల
దెరచికొని రావు రూపొంది దివ్యమూర్తి?

కనబడని నిన్ను లోక లోకాల నరసి,
వినబడని నీ స్వరమ్ముకై వీను లొగ్గి
తను వాకే పూజగా నీకు ధారవోసి,
చూపు లెత్తుకు వేతు నీ రూపు గాంచ!

ఎంతకాలము వేసట చింత రగుల?
ఎంత కాల మూకలి రెప్ప లెగిరి వెదుక?
చిరతరాశా మరీచిక జిక్కి- స్రుక్కి-
నా హృదయసూనము లవెన్ని యూహులింతు?

# సందేహము

గాలి దోలిక లందు కకుబంత వీధి
నడయాడి నాట్యాల నవ్వుల గురిసి,
పసిడి వేకువ పెండ్లి వసనాల తోనె
తరలెనా! — మరలునా తరళాంబుదమ్ము?

పూవులలో విచ్చి తావి సంపదల
నిట్టూర్చి విరహమో నిరసనో చూపి,
విరవారు తొలి ప్రొద్దు మెరుగుల తోనె
మరగెనా! — కరగునా మల్లిక యెడద?

చూపు తూపుల బంచి చుక్కల దారి
తరళమై సరళమై తక్కుచు తారి,
చెదరు నిద్దుర చీర చెరగుల విసరి
పోయెనా మాయమై పొడుపు తారకము?

మాటిమాటికి నన్ను మరిగించి రేపి,
నా ప్రేమ నా గుండె నవయింప నేలో! —
ఎద గాల్చు నీ జ్యోతి యెపుడు నాదౌనో?
ఎపుడేని నాదైన నెటు నిల్పనౌనో?

# పరిచయవాక్యాలు

"పురూరవ"

ఓమ్

౧

"విశ్వేశ్వరరావూ! నీ పద్యాలన్నీ కలిపి ఒక పుస్తకంగా తయారు చెయ్యాలయ్యా!" అని నేను నాలుగైదేళ్ళ క్రితమే ఇతన్ని హెచ్చరించాను. నేను పద్యాలు వ్రాసేవాళ్ళందర్నీ అలా అడగను.

విశ్వేశ్వరరావు నిజంగా కవి.

అసలు ఇతనికి కవిత్వం వ్రాయడంతప్ప ఇంకేమీ రాదని నా నమ్మకం. నాకూ అంతే. మరేదైనా పనిలో లోకమంతా కట్టుకట్టి మమ్మల్ని పడేస్తే, ఆ పనీ పాడవుతుంది; మా కవిత్వమూ పాకులాడుతుంది. దైవానుగ్రహంవల్ల విశ్వేశ్వరరావు దేనిలోనూ చిక్కుపడక ఇంతవరకూ కొట్టుకొచ్చాడు. లోకంమాత్రం విశ్వేశ్వరరావు ఇంకా స్థిరపడలేదంటుందేమో!

కవులనబడేవాళ్లు రెండురకాలున్నారు. 'నీల్ కాల్' సిరాలో కలం ముంచి వ్రాసేవాళ్లొకరూ; నీలాకాశం వెనకాలకి నిశిత దృక్కులు గుచ్చి వ్రాసేవాళ్లొకరూ. రెండోరకంవాళ్లు అసలైనవాళ్లు; అసాధ్యులు.

ఇతను రెండోరకంవాడు.

మొట్టమొదట, కవికి నారదుని 'మాంసలాంసమున జొనిపిన మహతి' లాంటి హృదయ ముండాలి, ప్రతీగాలివ్రేళ్ల నొక్కు-లకీ అలా అలా చలించుకునిపోయే తీగలూ అదీని. అలాంటి గుండె ఉంటే, జీవితంలో ఏమంచి అనుభవం వచ్చినా కవి తన్మయుడై పోతాడు. ఉదాత్తమైన 'భావోద్వృత్తి' (తన్మయత్వము, Emotion)కలుగుతుంది.

ఆ అంతర్వేగం ఉన్నవాడికే, నీలాకాశం వెనకాలికి అంటే 'పెనుచీకటి కవ్వలి' కి చూడగలిగే భావనకూడా (Imagination) ఉంటేనా! ఈవరం చాలా చాలా కొద్దిమంది కుంటుంది. కవులనబడేవాళ్ళకెందరికో నిజానికీశక్తి ఉండదు. ఇదే కవిని స్వతంత్రుణ్ణిచేసి, ప్రత్యేకవ్యక్తిత్వమంటూంటారే దాన్నిస్తుంది.

వీటికితోడు, గుండెల్లో లోపల్లోపల సంగీతమున్నవాడైతే, చెప్పదలచుకున్నవాటికి సరిగ్గా సరిపోయేటట్టూ, పాతమాటలు కొత్త అర్థం స్ఫురించేటట్టూ కలుస్తాయి; కొత్తమాటలు కూడా వస్తాయి. కొత్తకొత్తనడకల ఛందస్సులు వచ్చేస్తూవుంటాయి; ఎంత పాతపాత ఛందస్సులైనా కొత్తకొత్త పరుగులెత్తుతూంటాయి.

ఈ మూడుశక్తులూ ఉన్నవాడు కవి.

విశ్వేశ్వరరావు కవి.

3

విశ్వేశ్వరరావు మంచి అదృష్టవంతుడు. నేటి తెనుగుకవులలో ఎంతోమందికి దొరకని సంపర్కాలు (Influences) కూడా కొన్ని ఇతని జీవితంలో ప్రవేశించాయి.

దాదాపు నూరేళ్లూ ఈ మధ్య, మొదట వంగదేశాన్నీ నెమ్మదిగా భారతదేశాన్నీ, కనపడేటట్టో కనపడకుండానో, అన్నివిధాలా మార్చింది బ్రాహ్మసమాజమని నా గట్టి నమ్మకం. జాతికి మహాశయాల్నిచ్చింది; రెక్కలు తొడిగింది. ఇక కళాలోకానికా ఠాకూరుల్నిచ్చింది. ఆంధ్రదేశంలో

కూడా బ్రాహ్మసమాజం గొప్ప పని చేసితీరింది. దీని ప్రభావంలో విశ్వేశ్వరరావు చిన్నతనంలోనే పడ్డాడు.

తరువాత విశ్వభారతిలో గురుకులవాసం. రవీంద్రుని సాన్నిధ్యంలో 'విశ్వం' చాలా వికసించాడు. దూరదూరాలనున్న మాలాంటివాళ్ళనెందర్నో అతివిచిత్రంగా మార్చి అనుచరులనుగా చేసుకున్న ఆ గురుదేవుని శాంతినికేతనంలో ప్రవేశించి, మహర్షులాసీనులైన వృక్షచ్ఛాయల్లోనూ, కళాభవనాల్లోనూ, నాట్యగృహాల్లోనూ తిరుగుతూ, వర్తమాన భారతంలో భారతీదేవికి ఏకైకనివాసమైన 'ఉత్తరాయనం' వైపు పదేపదే ఊరికే చూస్తూనైనా అయిదేళ్ళు ఆనందంగా ఇతనుండగలిగాడు.

ఇంటికి తిరిగి వచ్చాడు. వసంతంమీదా వానచినుకుమీదా కులాసాగా పద్యాలు ఆలపించాడు. నేను విన్నానారోజుల్లో. 'గడ్డిపువ్వుని' అన్నాడు. 'తెప్పవోలిక చంద్రబింబం తేలిపోతూవుంది' అన్నాడు. "అన్నా! ఇతని మాటకీ పాటకీ లోతూ, వేడీ, గడుసుదనం ఇచ్చే సంఘటనలూ అనుభవాలూ కూడా ఏవైనా ఇతని బ్రతుకులో వచ్చి పడితే బాగుండునే" అనుకున్నాను. ఇంతలో ఓనాడు వచ్చి 'ఏ రేయి చీకట్లు నీచేయి తుడుచునో......నా వాడువారు గుండెలలోని పూగుత్తి' అన్నాడు.

మధుకీల తయారైంది.

నా కిష్టమైన కొన్ని కావ్యాలు:

'ఆవాహన' సుప్తమధుకీలలాగ లోపల లోపల అంటుకుంటూ పరుగెత్తింది.

'నిశాలోచన' లో 'నిదురలో వెన్నెలలు నిశ్వసించాయి' అన్నప్పుడు నాకెందుకో అవి నిదరలో పక్కకి ఒత్తిగిల్లినట్లూ, పలవరించినట్లూకూడా అనిపిస్తుంది.

"వేయితారల మిన్కు
లూ, తళ్కులూ
...............
నీకళ్ళ లోతులం
దో కోమలీ! తూగు
తూ, ఊగుతూ, పాడు
తూ నాట్యమాడేని' —

ఈ ప్రేమగానము మరీ తూగుతూ, ఊగుతూ,

'అరవిచ్చి పసివాడు
సుమ మాడునో?
విరిగి వ్రాలిన లేత
ద్రుమ మాడునో?'

అనేటప్పటికి ఎంతో అలసిపోయి, విరిగి, వాలి, మూర్ఛిల్లింది!

'నిశి కడుపులోన దీపిక లెవరు' నిలిపారో, సూటిగా అడిగి,మరీ సూటిగా చెప్పాడు.

'పిపాస' చదివాక, కాలి కాలి బ్రద్దలైన ఓ పెద్దబయలూ, దానిమధ్య చేతులుచాపి ఓ తుమ్మచెట్టూ జ్ఞాపకం వచ్చి జాలీ భయమూ వేస్తాయి.

'విస్మృతి' తన కన్నులు
వికసించుక
మనల పిల్చు
నొక తారక! — ఈ గేయం అంటే నాకు చాలా ఇష్టం.

'ఏనాడు' అంటే అన్నింటికన్నా.

'ఉజ్జీవనము' లో ఈ రెండూ నాకూ తెలుసు —'ఒక్క తారక నింగి నొదిగి నర్తించడం'; 'వాడిన విరహమ్మై వాడిరై మరల ఆగిన అన్వేషణార్థమ్ము' రేపడం.

'సింగారం' ఒక్క పులక.

'విరహావిజయము' లో

'మినుకుమినుకు మని వెదకును వేగురిక్క—
విలవిల చలియించును దిగిపోవు చుక్క—
వెండిమొయిలు మైదానమె
రెండిటికి దూరము సేయును' — గొప్ప పంక్తులు.

నాకు బాగున్నవన్నీ ఎలాగ చూపించడం?

౫

విశ్వేశ్వరరావుకి నేనూ నా కావ్యాలూ అంటే చిన్నప్పట్నుంచీ చాలా ఇష్టమనుకుంటా. నాకు అతనూ అతని కావ్యాలూ అంటే ఎంతో ఇష్టం. అభిరుచులూ, ఆశయాలూ, ఇలాంటివన్నీ చాలావరకు ఒక మోస్తరువే.

అంతేకాదు.

నా బ్రతుకుమాత్రం మధుకీల కాదూ! అబ్బ!

